## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2990100071344

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓం

# జానపద గేయాలు

సేకరణ:

ఏల్లోరా

నాచే సేకరింపబడి, సమర్పించబడిన

# జానపద గేయాలను

విశాలాంధ్ర మహాజనులకు

రేడియో ప్రసారాలద్వారా వినిపించి,

జానపద కృషికి ఎంతో దోహద మిచ్చిన

**ఆ లిం డి యా రే డి యో**

మద్రాసు కేంద్రం వారికి

తెలుగు జనపదాల సహజ సౌందర్యాన్ని చూస్తుంటే - వచ్చే పోయే పడవలతో నిండిన కాలువలు - ఎదిగి, పండి, పిలిచి పలుకరించే పచ్చని వరిచేలు - ఏటినుంచి నీటి కడవలతో - ఒయ్యారపు నడకల సింగారాలతో, కి[illegible]చలాడుతూ, పాడుకుంటూ పోయే పల్లెపడుచులు - ఏటిగట్లమీద దూడలనుకాస్తూ, గొంతెత్తిపాడుతూ తిరిగే పయిల కుర్రవాళ్ళ ఆటలు, పాటలు - చూస్తూ వింటూ, పోతూంటే - సంగీతం రానివాడైనా - సంగీతం అంటేనే తెలియని వాడైనా - ఆ ప్రకృతి రామణీయకానికి - ఆ జానపదుల జిగేలు మనే సౌందర్యానికి - తన్మయుడై, అందులో లీనమైపోయి - తాను కూడా కూనిరాగాలు తీస్తాడు!

జానపదజీవిత మధుర ప్రతిబింబాలనతగిన జానపద గేయాల'ను సేకరించాలనే జిజ్ఞాస నాలోకూడాకలిగింది!

అందుకుతోడు మా అమ్మ ప్రతిదినం తెలతెలవారుతుండ గానే మేల్కొని, 'మేల్కొల్పులు', 'గుమ్మడేడే గోపిదేవీ', 'శ్రీ కృష్ణలీలలూ' - చక్కని వరుసలలో పాడుతూంటే, నేను వినడం జరిగేది. వాటి యింపు సొంపులకు పొంగి ఏ పవిత్రలోకంలోనో విహరిస్తూన్నట్టనిపించేది. ఆనాటి మాతల్లి చలవే నేడు నాలో జానపద గేయాల సేకరణకు ఎంతగానో కొంత వుత్సాహం, బలం కనిపించ డానికి కారణం.

పట్టుదలతో కొన్ని గేయాలను సేకరించి ఆలిండియా రేడియో, మద్రాసు కేంద్రంవారికి అందజేశాను. వారు నా కృషికి చక్కని ప్రోత్సాహమిచ్చారు. ఆ గేయాలను రేడియోద్వారా ఆంధ్ర ప్రజానీకానికి వినిపిస్తూ నా వుద్యమానికి ఎంతో ప్రోద్బలమిచ్చారు - వారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు అందజేస్తున్నాను.

నా గేయాలను ఒక సంపుటిగా తీసుకురావడానికి ప్రోత్సహించిన శ్రీ నార్లవారికి కృతజ్ఞతాభివందనాలు.

ఈ కృషికి అమూల్యమయిన సలహాల నిచ్చిన డాక్టరు శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారికి, శ్రీ పందిరి మల్లికార్జునరావు గారికి నా నమస్కృతులు.

నా కృషికి ఒకరూపు యివ్వడంకోసం ముందుకువచ్చి సేకరించిన వాటిలో కొన్నింటిని సంపుటిగా ప్రచురిస్తూ - జానపద వాఙ్మయ సంపాదనోద్యమానికి గణనీయమైన చేయూత నిస్తూన్న విశాలాంధ్ర ప్రచురణాలయంవారికి నా ధన్యవాదాలర్పిస్తున్నాను.

సేకరణలో - ఎంతో సహృదయతతో నాకు తోడ్పడిన మిత్రులు - శ్రీ సి. హెచ్. వి. హనుమంతరావుగారికి సంతోష పూర్వకంగా అభివందనాలు అందజేస్తున్నాను.

ఈ గేయాలన్నీ ఆంధ్ర మహాజనులవే. అయినప్పుడు వారు ప్రథమ సంపుటిని స్వీకరించి ఆదరిస్తారని ఆశించడమే కాదు, విశ్వసించడంలో ఆశ్చర్యమేముంది? ముందు ముందు మరికొన్ని సంపుటాలను అందజేయడానికి కృషిచేస్తాననిమాత్రం విన్నవిస్తున్నాను.

"ఎల్లోరా"



# విషయసూచి

# ఊడ్పుల ప్రారంభం

గనపతయ్యా
గనపతయ్యా
ఉండ్రాళ్ళా నీకుపోతురా
ఓ గనపతయ్యా
మందకొడిగ వుండబోకురా ...

గనపతయ్యా
గనపతయ్యా
జమ్మిపత్రిపూజసేతురా
ఓ గనపతయ్యా
ముందెనీకు పూజసేతురా ...

గనపతయ్యా
గనపతయ్యా
మనసునిండు పూజసేతురా
ఓ గనపతయ్యా
మమ్ము ఎపుడు మరువబోకురా ...

గనపతయ్యా, గనపతయ్యా
ఊరిలోన ఊరేగించెదా
ఓ గనపతయ్యా
ఉయ్యాలల ఊపుతానురా ..

గనపతయ్యా, గనపతయ్యా
ఉండ్రాళ్ళా నీకు పోతురా
ఓ గనపతయ్యా, మమ్ము
ఎపుడు మరువబోకురా ...

# పిల్లతో సరసాలు

కూలికొత్తావంటె
పిల్లా మరీ ...
కూలంటె కులాస
అయ్యా మాకు ...
నేతకొత్తావంటె
పిల్లా మరీ ...
నేతంటె నేటేను
అయ్యా మాకు ...
ఊడ్పు కొత్తావంటె
పిల్లా మరీ ...
ఊడ్పంటె ఊగులాట
అయ్యా మాకు ...
పత్తి కొడతావంటె
పిల్లా మరీ ...
పత్తంటె వళ్లమంట
అయ్యా మాకూ ...
కోతకొత్తావంటె
పిల్లా మరీ ...
కోతంటె కోలాటం
అయ్యా మాకూ...!

# యేయి వరాలు

యేయి వరాలో
యేయి వరాలో
ఏకులోడికిన పాప
యెఱ్రన్న పాప ॥యే॥

అరూగో అన్నల్లు
వచ్చూచున్నారు ॥యే॥
ఆరెందుకొస్తారు
రాజూలల్లుళ్లు ॥యే॥

రాజూలల్లుళ్లైతే
రారంటే పాప ॥యే॥

నా మాట బోటైతే
మేడెక్కి చూడమను ॥యే॥

గోడపై నుచ్చెన్లు
మేడాపై వేసింది ॥యే॥

కట్టున్న చీరల్లు
చిరుకచ్చ లోసింది ॥యే॥

యెండూ బల్లికిమల్లె
ఎక్కింది పాప ॥యే॥

పైడీ బల్లికి మల్లె
ప్రాకింది పాప ॥యే॥

అల్లంతదూరాన
అన్నలను చూసి

చెవ్వూ చెవ్వూన పాప
మేడా దిగింది... ॥యే॥

హైలేసో - హావ్వారి హావ్వ
లాగరోరీ - లంగరు తాడూ
పీకరోరీ పిల్లాడి జుత్తూ
జంబైరే జోతు లంగరి
లాగరోరీ లంగరు తాడూ...

మూడునెల్లా ముందాలపోరూ
ఆరునెల్లా జన్మ ఖైదు
ఎక్కరానీ పడవా మీదా
సెప్పరానీ దుక్కా మొచ్చే
హైలేసో - హావ్వారి హావ్వ.

## ఓ చిన్నదాన

గుంటూరు చిన్నదాన
గుబురూ కేశాలదాన
గుబురూ కేశామీద
గొబ్బి పూలు సోకే

పువ్వాడ చిన్నదాన
పువ్వూల జడలదాన
పువ్వూల జడలమీద
మనసెంత నీకే...

రంగాము పోయి నేను
రంగైన రైక తెస్తే
రంగైన రైక మీద
మనసేల లేదే...

సేతినున్న గాజుల జోడూ
ఈయమని తా వచ్చేనమ్మా
ఈయమని తా వచ్చేనమ్మా
యిచ్చి తెల్లవారి జూడాబోతే
అడవిలో రుద్రాక్షలాయనటమ్మా
రాతిరొచ్చిన సాంబశివ్వుడూ
ఎంతకైనా మాయల వాడూ.

## మాంప

ఎల్లొస్తానోయ్ మాంవ
మల్లొస్తాను
మల్లొస్తానోయ్ మాంవ
ఎల్లొస్తాను...
కళ్లు తెరిసె తలికి
కళ్లెదుట వుంటాను
వళ్లు యిరిసే తలికి
ఒళ్లోన వుంటాను...
సుళ్లు తిరిగొస్తాను
గళ్లు కదిలొస్తాను ॥ఎల్లొ॥

సక్కని తురాయిక్రిందా
చుక్కలాంటి రాయీమీదా
ముక్కుతూ మూలుగుతూ
ముడుచుకొని తొంగేవు
మురిసినా, తలిచినా
ముంగలే వుంటాను ॥ఎల్లొ॥

## ల్లా రే

ఎల్లా రే నల్లామా॥

అంతరాల పడవమీద
ఎల్లా రే నల్లామాను
అందీ పువ్వులు కొయ్యబోతే
ఎల్లా రే నల్లమాను
కొమ్మ తగిలీ కొప్పునిండే
ఎల్లా రే నల్లమానూ
కొప్పులోనా పువ్వాలన్ని
ఎల్లా రే నల్లామాను
గొప్పగాను గుబురూనిండె
ఎల్లా రే నల్లామాను
గుబురూ కొప్పు పువ్వుల్లోన
ఎల్లా రే నల్లామాను
రాలిపువ్వు రంగమెల్లె
ఎల్లా రే నల్లామాను
రంగమంత భంగపుచ్చె
ఎల్లా రే నల్లామాను.

## కా  క

మనయింటి యెనకాల
దానిమ్మ చెట్టో
దానిమ్మ చెట్టున్నాది
నాయు డప్పన్నో
దానిమ్మ పండే తినాలి
తింటేను దానిమ్మ
పండే తినాలి
కంటేను తొలుచూలు
కొడుకును కనాలి
కొడుకును కనాలి...

మనయింటి యెనకాల
బత్తాయి చెట్టో
బత్తాయి చెట్టున్నాది
నాయుడప్పన్నో
బత్తాయి పండు తినాలి
తింటేను బత్తాయి
పండు తినాలి
కంటేను తొలుచూలు
కొడుకును కనాలి
కొడుకును కనాలి...

## పాట

శ్రీ కాంతామణి నే నీ సఖుడను
శీఘ్రము వాకిలి తీవే నీవు
శీఘ్రము వాకిలి తీవే.

ఓ కాంతుడ నీగుణములు తెలిసెను
ఊరికె వెళ్ళగదోయీ, నీవు
ఊరికె వెళ్ళగదోయీ.

ఈ మాటలు నీవెన్నడాడవైతి
ఏమే అలుమేలుమంగా, అది
ఏమే అలుమేలుమంగా.

భామలమరగిన వాడవు నాతో
పలుకు లేలపో—పోయీ— యీ
పలుకు లేల పోవోయీ.

పరభామలనే కూడితినని యిట్లు
పలుకుట కారణమేమే సఖి
పలుకుట కారణమేమే.

తరుణులకూడక యుంటె – పువ్వుల
దండలు ఎక్కడివోయీ – పూల
దండలు ఎక్కడివోయీ.

హరిహరి నేనేమెరుగను – భక్తులు
అర్పించిరె వో చెలియా – నా
కర్పించెరె వో చెలియా.

లె

ఓలోలే – ఓలోలె
పిల్లా నీవూ !
గోంగూర కోయగలవ
పిల్లా నీవూ ?
గోంగూర కోయలేను
అయ్యా నేనూ
గోళ్ళన్ని కందుతాయి
అయ్యా నాకూ
ధాన్యమైన దంచగలవ
పిల్లా నీవూ :
ధాన్యమంటె దగ్గొస్త
దయ్యా మాకు,
ఏకులైన వడకగలవ
పిల్లా నీవూ !
ఏకులంటే యేముపోస
దయ్యా మాకు,
ఎల్లైన వెయ్యగలవ
పిల్లా నీవూ ?
ఎల్లంటె ఏటోను
ల మాకు
చాపైన యెయ్యగలవ
పిల్లా నీవు ?
చాపంటె చక్కడత
అయ్యా నేను

పిల్లా నీవు?
సంతంలు సంతోష
మయ్యా నాకు.

★

## పిల్లపాట

కాటుకెట్టిందిరా పిల్ల
చూడమని.
ఏలో డోముకులాడి...
కమలా బెట్టింద్రా పిల్ల
చూడమని...
కాసులేసింద్రా పిల్ల
చూడమని...
తలకాయదువ్వింద్రా పిల్ల
చూడమని...
లోలకులెట్టింద్రా పిల్ల
చూడమని...
బేసరెట్టింద్రా పిల్ల
చూడమని...
గాజులేసింద్రా పిల్ల
చూడమని...
పట్టాలెట్టింద్రా పిల్ల
చూడమని...
చరుపుచరిచింద్రా పిల్ల
చూడమని...

సూర్యచంద్ర వహ్నిః
శౌర్యమానే చిలుకగంటీ
సూర్యదీప్తి గాయుచుండాగా - యేగంటి లింగ
చూడజూడాశ్చర్యమాయెరా.

కాంతాలపాః
చింతమానూ పుట్టెగదరా
చింత అనలూ కొనలు సాగానా - యేగంటి లింగా
చింతపూసీ పండుపండేరా.

కానరాని యడవిలోన
వానలేని మడుగునిండె
వానలేని మడుగుమీదానూ - యేగంటి లింగా
మానరానీ అగ్ని పొడమేరా.

ఆకులేని యడవిలోన
తోకలేని మృగము పుట్టె
తోకలేని మృగము కడుపునా - యేగంటి లింగా
ఈకలేని పక్షి బుట్టెరా.

# వరికోతపాట

జంబైలోతే - జోతులంగరు.
అన్నాలారా - తమ్మూల్లారా
జంబైలోతే - జోతులంగరు
జోరీగుళ్ళా యీాదీలోనా
జోరూచేసీ పలకారన్నా
మిద్దీమీాదా - మిరపాచెట్లూ
నీళ్ళులేకా - జోగీపోయే
అంతరాలు - పడవామీాదా
అందీపూలూ - కోయాబోతే
రాలీపూవూ రంగామెల్లి
రంగామంతా భంగాపుచ్చే
మంచినీళ్ళ - బావీకాడ
పుట్టామీాద - పాలా పిట్ట
కొట్టాబోతే - తేలూ కుట్టె
బావాగారు మంతారించె
భల్లూ భల్లూ తెల్లా వారె
ఎఱ్ఱి చెరువూ గట్లామీాద
ఎడ్లామేపే - చిన్నవాడా
ఎడ్లాకేసే - పాలీకేక
నాకుయేస్తే నేనూరానూ.

సువ్వి సువ్వి సువ్వానీ
సుదముఖు దంచెదరో - లాల

వనితల మనసులు కుందెవచేసిటు
వలపులు తగనించో - ఓ లాల

కనుసన్నలనెడి రోకండ్లానూ
కన్నెలు ధంచెదరో - లాల

బంగరు చెరగుల పట్టుపుట్టములు
కంగులు దూలగ నో - లాల

అంగనలందరు నతివేడుకతో
సంగడి దంచెదరో - లాల

కురులుదూలగ మంచి - చన్నాల
సరులు దూలాడంగనో - లాల

అరవిరిబాగుల నతివలు ముద్దులు
గురియుచు దంచెదరో - లాల

ఘల్లుఘల్లుమని కంకణ రవములు
పల్లవ పాణులకో - లాల

అల్లన నడుములు అలసియాడ సతు
లోల్లన దంచెదరో - లాల...

కప్పురగంధులు కమ్మని పువ్వుల
చప్పరంబులనే - ఓ లాల

తెప్పలుగారని దేలుచు గోనే
టప్పని బాడెదరో - లాల.

# పడవ సరంగు పాట

నేలను నమ్మి ఏలేలో
చెట్టూ వున్నది హైలే..

చెట్టును నమ్మి ఏలేలో
కొమ్మా వున్నది హైలేసా

కొమ్మను నమ్మి ఏలేలో
రెమ్మా వున్నది హైలేసా

రెమ్మను నమ్మి ఏలేలో
అమ్మి వున్నది హైలేసా

అమ్మిని నమ్మి ఏలేలో
పువ్వా వున్నది హైలేసా

పువ్వును నమ్మి ఏలేలో
పిందే వున్నది హైలేసా

పిందెను నమ్మి ఏలేలో
కాయా వున్నది హైలేసా

కాయను నమ్మి ఏలేలో
పండు వున్నది హైలేసా

పండును నమ్మి ఏలేలో
నేనున్నాను హైలేసా

నన్ను నమ్మి ఏలేలో
నువ్వున్నావు హైలేసా.

## చిన్నదాన

గూడూరు చిన్నదాన
గూడూరు గుట్టాలదాన
గూడూరు గుట్టాలమీద
గాజులుంటే సోకే... ||ఓ చిన్నదాన||

నీలి నీలాటి దాన
నిలువు సన్నాటి దాన
నీలి నీలాము మీద
నగలుంటే సోకే... ||ఓచిన్న||

సన్న సన్నాని దాన
సన్నాని కురులా దాన
సన్నాని కురులా మీద
జాజి గుత్తి సోకే... ||ఓ చిన్న||



## జాలిబొంబైలే

జాలి బొంబై లే – జాలిరా ఓ చేలిజెల్ల
జాలి బొంబై లే – అన్నలార తమ్ములార
జాలిబొంబై లే – అందమైన శూరులార
జాలిబొంబై లే – సూరుమోత జోరుమోత
జాలిబొంబై లే – మూగునూగు మీసగాళ్ళు
జాలిబొంబై లే – నూటికొక్క కాపుబిడ్డ
జాలిబొంబై లే – జోరుతో జొన్నాడదాటి
జాలిబొంబై లే – బారుతో బందారుదాటి
జాలిబొంబై లే – జాలిరా ఓ చేలిజెల్ల...

పా

ఓ అరిజెల్ల
జెరిమోత
ఓ నల్లనేలల
దున్నదలచేరా
మొక్క–బోతే
ఓదయ్యామైరా
పట్టినాడీరా
ఓ మానయుంబాధా
గాలి మోతారా
ధూలిమోతారా
ఓ రేమిరన్నయ్యా
ఓ ఉసారి లేదురా
ఓ రాగిడబ్బూబరా
యీాదు ముంతారా
ఓ బొట్టుపెట్టారా
బొమ్మ చూడారా
ఓ మిద్దె మీదారా
మిరప చెట్టురా
ఓ కాయ చూడారా
ఓ నీలు లేవూరా
పాలు లేవూరా
ఓ కూకున్నాదీరా
కుఱ్ఱిగుంటూరా
ఓ మేతి గోడూరా
దా నెంప వెళ్ళారా
ఓరి కంచమంతరా

ఓ గుడిసెలోనూరా
ఓ మాణికంతర
ఓ రోటు తోసెరా
ఓ అరిశెల్ల
ఖేరిమాత



## యేలేయల్లో

యిలేయల్లో
యేలేయల్లో
యేలేయల్లా... ॥యే॥

తోటామధ్యా యిల్లూచూడూ
తోటచుట్టూ చెట్లూచూడూ
ఇంటిదానీ కంటపడకా
ఇంటిలోనీ పిల్లని చూడూ
పిల్లాసిగలో పూలూ చూడూ
పిల్లాదానీ సోకూ చూడూ
సోకూ సూసి జాతి సూసి
జాతిసూసి, నీతీసూసి
జాలిగానే దాన్ని చూడూ
చూరువార దాన్ని చూడు
తీరుగానే దానీచేరి
కొప్పులోని పూలాతోటి
తిప్పులాడి పిల్లాతోటీ
ఆడరా నీ కందీనంత
ఆశదాన్ని పొందినంత.

# గౌరి - లక్ష్మి సంవాదం

గౌరి దేవి నీ శంభు దేవునకు
గళమున నలుపేమమ్మా -
నారీమణి నీ విష్ణు దేముడూ
నలుపు కాదు టే కొమ్మా -

ఏమి లేక నీ కాంతుడు జగమున
ఎద్దు నెక్కెనే మమ్మా -
పంతముతో నీ కాంతుడు
పశులకాసెనా కొమ్మా -

అద్దు లేక నీ వల్లభుడూ
సుఖమాడ రూపమేమమ్మా -
ముద్దుగుమ్మ నీ మురహారి పెనిమిటి
మోహిని కాదటె కొమ్మా -

పంకజాక్షి నీ శంకరి కరమున
జింక వున్న దేమమ్మా -
పంతముతో వనవాసము కేగి
జింకను వేసెనె కొమ్మా -

చింత లేక నీ కాంతుడు బ్రహ్మను
శిరసు త్రుంచెనే మమ్మా -
పంతముతో రావణబ్రహ్మను
పదితలలు త్రుంచెనే కొమ్మా -

విశాలాక్షి నీ విభుని మాయలా
జంగము కులమే మమ్మా -
పాలుపెరుగు లమ్మగను గొల్లవారి
కులము కాదు టే కొమ్మా —
పార్వతి దేవి నీ విభునికి
నిలువున పాములున్న వేవమ్మా —

అప్పుడే కాళింగి మడుగులో
నాట్యము చేసిన కొమ్మా —
పార్వతిదేవి వైదేహి పలికిన
వంతము వినరమ్మా —
విన్నవారికే విష్ణులోకమూ
కైలాసము కాదటె కొమ్మా —



## ఓ నల్లదాన

అంచూన నల్లజీర
అచ్చాము తెల్లచీర
అందూన సీతాఫలమే
ఓ నల్లదాన
అందూ నా మనసే
ఓ నల్లదానా –
గొప్పాగ నిన్ను చేరి
సీటూగ యాత్ర కెడితే
నీతికి భంగమాయెనే
ఓ నల్లదాన
నిన్నూనే విడువాలేనే
ఓ నల్లదానా –
చెంపాను కమ్మల జంట
చేతూల గాజుల జంట
నీముందు సోకులెందుకే
ఓ నల్లదానా
నాయందు పరాకెందుకే
ఓ నల్లదానా...

# పడవ పాట

నీటిని నమ్మి ఏలేలో
నేలున్నదీ హైలేసా
నేలను నమ్మి హైలేసా
పంటావున్నది హైలేసా
పంటను నమ్మి ఏలేలో
ప్రజలుండారూ హైలేసా
ప్రజలకోసం ఏలేలో
పంటున్నాదీ హైలేసా
పంటను నమ్మి ఏలేలో
కాపున్నాడు హైలేసా
కాపును నమ్మి ఏలేలో
రాజ్యం ఉండది హైలేసా
రాజ్యాన్ని నమ్మి ఏలేలో
రాజుండాడూ హైలేసా
రాజ్యంలోనా ఏలేలా
నువ్వున్నావు హైలేసా
నిన్నూనమ్మి ఏలేలో
నేనున్నాను హైలేసా
మనలను నమ్మి ఏలేలో
పడవుండాది హైలేసా
పడవను నమ్మి ఏలేలో
బ్రతుకుండాదీ హైలేసా
హైలేసో...హైలేసా..

# కోరికలు

పండ్లతో నిండిన పచ్చని గంప
పడతులకు కోరిక దింపండి గంప
పచ్చగా పండినా పనస ఫలాలు
పడతులకు మనసారా పంచండి తొనలు
కోరగా వేగినా మొక్కజొన్నల్లు
దోసిలితో పంచండి పడతులందరికీ
పండ్లతో నిండినా మా మనసునిండు
పండంటి పాపడూ కావాలిమాకు
పడతులకు కోరిక దింపండి గంప
పండ్లాతో నిండిన పచ్చనిగంప.



# విభూతి పండు

వేసుకొన్నా చంద్రహారము
వేసుకొమ్మని తానిచ్చేనమ్మా
వేసి తెల్లవారి చూడబోతే
కాశిలో రుద్రాక్షలాయెనటమ్మా
రాతిరొచ్చిన సాంబశివునీ
నమ్మరాదే అవునే ఓయమ్మా...
పూసుకొన్నా పునుగు జవ్వాజి
పూసుకొమ్మని తావచ్చేనమ్మా...
పూసి తెల్లవారి చూడబోతే
కాశిలో విభూతి పండాయనుటమ్మా..
రాతిరొచ్చిన సాంబశివుడూ
ఎంతకయినా మాయలవాడూ ...

## లాలి పాట

లాలి శ్రీ జనలోల
లీలా వినోదా
లాలి ద్వారకపురి
బాల గోపాలా...

తొలుత బ్రహ్మాండంబు
తొట్టెగా వేసి
నాలుగూ వేదములు
గొలుసులమరించీ
బలునైన ఫణిరాజు
పాన్పులమరించీ
చిత్తమని యేటి
దూలములు వేసి...

అందముగ జాంబవతి
చందనము పూయ్యా
పొందుగా కాళింది
పూవులందియ్యా
మందయానయు రాధ
మనపు లందియ్యా
ఇందుముఖి లక్ష్మణా
వింజామరేయ్యా...

చుట్టుగోప స్త్రీలు
తొట్టె నూచంగా
కోట రంగారాజు
కోర్కె లొసగంగా...

## తలుపు దగ్గర పాట

వభక్తులకే దయగలవాడను
వుడందురు నా పేరూ - సాంబ
వుడందురు నా పేరూ

శివనామంబులు సకలెందుల జెల్లును
చేరికతో వుండవోయీ - శివ
చేరికతో వుండవోయీ

వడిగిన లందిన కుంతన లోసగెటి
సురపతి దరుడనె గారీ - నే
సురపతి దరుడనె గారీ

ఉరపతి దరుడవైతే యెలాయెను
వడలు కడకు పోవోయీ - శివ
వడలు కడకు పోవోయీ.

బలాన రాముడు బలసతి నడిగిన
బలిదుండుడనే గారీ - నే
బలిదుండుడనే గారీ.

బలిదుండుడవైతే యేలాయెను
భక్తులిళ్ళకు పోవోయీ - శివ
భక్తులిళ్ళకు పోవోయీ.

కోమరుగ గంగని జటలో నించుకు
కోమర జంగాన్నే - గారీ - నే
కోమర జంగాన్నే గారీ.

కోమర జంగమైతేమాయెను
కోమరులింద్లకు పోవోయీ - శివ
కోమరులింద్లకు పోవోయీ.

కాశీ లోపల [illegible] లోనగల
గంగాధరుడన గారీ - నే
గంగాధరుడన గారీ.

వాశికి హాలాగై తిరిగే మరు
వార్నాశినై వుండవోయీ - శివ
వార్నాశినై వుండవోయీ.



## దంపుపాట

చుట్టాలొచ్చారురా
చూడే మంగయ్యా... ॥ చుట్టా ॥

వాకిట్లో పీటేసి
తిట్టే మంగయ్యా... ,,

నల్లేరు కాడ తెచ్చి
నలుపే మంగయ్యా... ,,

ఉబ్బంత కాడ తెచ్చి
ఉసిరే మంగయ్యా... ,,

దూలగొండా తెచ్చి
దులుపే మంగయ్యా... ,,

# లక్ష్మి - విష్ణు సంవాదం

కలికి కవాటము
బంధన చేసిన
కారణమేమే లక్ష్మి - నీకు
కారణమేమే లక్ష్మి.

కారణ మేమని
అడిగెవు నీమది
తెలియలేద ధవలాక్షా - మరి
తెలియలేద ధవలాక్షా.

తెలిసీ తెలియక
చెంతను చేరితి
వంతమేలనే లక్ష్మి - నీకు
వంతమేలనే లక్ష్మి.

కొంచెపు జాతని
చెంచిత సవతని
చింతదీరెనో సామీ - నాకు
చింతదీరెనో సామీ.

జిలుగుపు ఓదల
చీరలు తెస్తిని
చెంత చేరవే లక్ష్మి - నా
చెంత చేరవే లక్ష్మి.

జిలుగుపు ఓదల
చీరలు తెస్తే
చెంచిత చేరును పోవోయ్ - నీవు
చెంచిత చేరును పోవోయ్.

చేపట్టు చేల్వ బంగారు
రవికలు తెస్తినే

జాగుసేయకే ధవళాక్షి - నను
చేరనీయవే కమలాక్షి.

జాల్వారు బంగరు రవికలు
చెంచీత కిచ్చిన
ఏలునుస్వామీ - నీ విచ్చిన
ఏలును స్వామీ.

ఇప్పపు బంతులు
ఇంపుగ దెస్తిని
ఇంపుగ యేలవె లక్ష్మి——నను
ఇంపుగ యేలవె లక్ష్మి.

ఇప్పపు బంతులు
ఇంతి చెంచితకి
ఇస్తే యేలున్ను స్వామీ - నిను
ఇస్తే యేలును స్వామీ.

మల్లెపు బంతులు
మగువరో తెస్తిని
మన్నించేలవే లక్ష్మి-నన్
మన్నించేలవే లక్ష్మి.

మల్లెపు బంతులు
మగువ చెంచితకిస్తే
మన్నించేలును స్వామీ - నిను
మన్నించేలును స్వామీ.

రవ్వలు చెక్కిన
రాగిడి తెస్తిని
రానియ్యవె ఓలక్ష్మి - నను
రానియ్యవె ఓలక్ష్మి.

రవ్వలు చెక్కిన
రాగిడి తెస్తే

చెంచిత కివ్వగదోయీ - నివు
చెంచిత కివ్వగదోయీ.

గరిమిష్టమ్మున
గండభేరుండంబులు
గాసి పొందితినే భామా - మేము
గాసి పొందితినే భామా.

గండభేరుండంబుల
గాసి బొందితే
చెంచిత యేలును స్వామీ - నిను
చెంచిత యేలును స్వామీ.

శరణే శ్రీహరి శరణే లక్ష్మి
శరణంటిని గైకొనవే - లక్ష్మి
శరణంటిని గైకొనవే.

కొత్త పెళ్ళికొడుకై నీవూ
వర్థిల్లుము వసుదేవా - స్వామీ
వర్థిల్లుము వసుదేవా.

పద్మదుంధి నీ పాదములాకూ
వందనములు పదివేలే - లక్ష్మి
వందనములు పదివేలే.

నవ్వుతు శ్రీ లక్ష్మి వాకిలి తీసెను
గడియతీసె వరలక్ష్మి అపుడే
గడియతీసె వరలక్ష్మి.

మదనజనక తన
మగువని తోడుకొ
మందిరములకే తెంచేన్ - లక్ష్మి
మందిరములకే తెంచేన్.

# శ్రీరాములవారి తొట్టె

శ్రీ వెలయు అయోధ్యలో
దశరథులు వెలసి వేడుకనుండగా
ఆ వనజనాభులపుడూ
భూమిలో అవతరింపుచు నుందురు
పుత్రకామేష్టి చేల్య
ఆ రాజపుత్రులను కోరగానూ
పాత్రతో పరమాన్నమూ
తెచ్చి ఆ పరమపురుషులకిచ్చిరి
పరమాన్న మపుడు తెచ్చీ
ఆ రాజు పడతులకు యివ్వగానూ
సరగునా గర్భమునను
ఉదయించి సంతోషమువ యుండిరీ
ఆరు నెలలాయెననుచూ
కౌసల్యకపుడు శ్రీమంతమునకు
ఆరూఢిగా చేయరే
వశిష్టాదులందరూ దీవించిరీ
దశమమాసము వచ్చినా
కౌసల్య ప్రసవసమయ మందునా
కుశలముగ ముగ్గురికినీ
సుఖముగా సుతులు నలుగురు కలిగిరి
అప్పుడా రాజుతోనూ
ఈ వార్త చెప్పినా విన్నగానే
ఒప్పయిన వస్త్రములనూ
బహుమాన మిప్పించి పుష్పంగానూ
రంగైన శాల్వలనూ
చెక్కించి బంగారు తొట్టెలకునూ

అంగనా మంచలా కోరకా
దశరథులు అలివేస్క సంపించిరి
అణిముత్యపు చేరులూ
తొట్టిపై అనుమానా గిరికికట్టి
పాలుపైన పూలసాదులూ
తొట్టిపై పూలు సింగారించిరి
కనులగాటుగ దీర్చెనూ
రాములకు కడువేడ్కతో కౌసల్య
దిష్టిచుక్క మరిపెట్టి
రాములకు జగమెల్ల వెలుగుగాన
పసుపుకుంకం పువ్వులూ
మేలైన పన్నీరు గంధములనూ
పసిడి తబుకుల వుంచుకో
సుమిత్ర సుభతులకు తాయిచ్చెనూ
పట్నీలు భాగాలనూ
మేలైన పండు టెంకాయలూను
పసిడితబుకులవుంచుకో
సుమిత్ర సుభతులకు తాయిచ్చెనూ
నూరు గరిసెల సెనగలూ
నీళ్ళలో నానబోయించి తెచ్చి
పారిజాత్తులకు నల్ల
కౌసల్యా వాయనాలిప్పించెనూ
ముష్టిక్రిందా సెనగలూ
కౌసల్యా గొడ్రాళ్ళకిప్పించెనూ
కోరి కొడుకుల కనమనీ
కౌసల్య గొడ్రాళ్ళ దీవించెనూ
ఊచుమని ఘుంతులూచ
డమని పరమ భాగవతులార

ఆడమని రంభలార
ఊయాలలూగుమా రంగశాయీ
సత్యస్వరూపుడమ్మా
ఈ బిడ్డ అచ్యుతానంతుడమా
అత్యంత సుకుమారుడే
ఈ బిడ్డ ఆదినాయుడు ద్ర
వటపత్ర శాయనూడమ్మా
ఈ బిడ్డ వైకుంఠపురివాసుడూ
పూర్ణంపు చంద్రుడమ్మా
ఈ బిడ్డ పురుషోత్తముడందురూ
కరుణాకటాక్షుడమ్మా
ఈ బిడ్డ కంసునికి వైరి యితడూ
కుటిలకుంతల చూడకే
దశరథులకోర్కె లీడేరెనమ్మా
చద్దులాడుచు కొందరూ
తమతమా సుఖములను తెల్పుకొనుచూ
నిద్దరని ఉల్కిపడుచూ
ఉల్కిపడి పొద్దుపోయెననుకొందురూ
అప్పుడా దోవలోనూ
సెనగలూ ఒప్పుగా నమిలి చూసి
ఉప్పు లేదనుచు వనిత
మరివనిత చప్పగా వున్న దనుచూ
శ్రీరామ నామంబులూ
ఎవరైన జపముచేసిన చాలునూ
వారలకు భయమేటికే
వైకుంఠవాసులై తమరుండురూ

శ్రీరామ తొట్టె ఉయ్యాలా
ఎవ్వరైన పాడినా, విన్నగాని
సకల సంపదలు కలిగి
సౌభాగ్య పదవిలో తనరుందురూ



## పిలుపు పాట

అవతలి గట్టున
నువ్వే రావయ్యో
ఇవతలిగట్టున
నేనే వస్తానో -
ఏమిటి రాజా
కంటిని బాధ
ఎన్నడు పడలేదూ ॥అవతలిగట్టున॥

లుంగీ వేసుకు
నువ్వే రావయ్యో
లంగా వేసుకు
నేనే వస్తానో
కాటుకెట్టీ
నేనే వస్తానూ ॥అవతలిగట్టున॥

వాచీపెట్టీ
నువ్వే రావయ్యో ॥అవతలిగట్టున॥
అవతలి గట్టున
నువ్వే రావయ్యో
ఇవతలి గట్టున
నేనే వస్తానూ.

## దంపుపదం

కోడలా కోడలా
పచ్చిపాలామీద
మీగడేదే ?
వేడిపాలామీద
వెన్న లేదే ? ॥కోడలా కోడలా॥

అత్త నువుబెట్టి
ఆరేళ్ళుగాని
పచ్చిపాలామీద
మీగ డుంటుందా ?
వేడిపాలామీద
వెన్న వుంటుందా ?



## దంపుళ్ల పాట

కూతురూ ఫుట్టినది
కుంచు పుట్టినది
దండాన కోకలకి
దాతా పుట్టినది
సువ్వి – హా – సువ్వి
కూతురు పెళ్ళమ్మ
కొడుకు వడుగమ్మ
ఆడపడుచు సమర్త
అల్లుడి మనుగుడుపు
సువ్వి – హా – సువ్వి

# ఊడుపు పాట

దండా దగ దగ లాడి
పచ్చా నిగ నిగ లాడి
దండా నీ కెవ రేశారూ
కొండమ్మ బుల్లి
దండా నీ కెవ రేశారూ ?

మేనత్తకొడుకమ్మ
ముద్దూల బావయ్య
దండా నందియ్య వేశారూ.
కొండమ్మబుల్లి
దండా నందియ్య వేశారూ

వారుచేసే దమ్ములాకు
మనమూడ్చే ఊడ్పులాకు
బలే గమ్మత్తు గున్నాదిలే
కొండమ్మ బుల్లి
బలే గమ్మత్తుగున్నాదిలే

వాడి పళ్ళే పకోడీలు
వాడి ముఖమే దుకాణం
బలే గమ్మత్తు గున్నాదిలే
కొండమ్మ బుల్లి
బలే గమ్మత్తు గున్నాదిలే

# పొగాకు పాట

రాయ పొగాకా
పాయ పొగాకా
మద్దూరు లంకాది
మంచి పొగాకు.

ఆలీ మొగలీ సందు
అలుకూలూ వచ్చాయి
అలుక తీర్చల్లే
కులుకు పొగాకా

చెవుల పిల్లి చెంచెయ్యగారి
చెట్ల పొగాకా
ఈడిగలు తాగేటి
ఈకల పొగాకా.

కాపూలు తాగేటి
కంపు పొగాకా
మాలోళ్ళు తాగేటి
మంచిపొగాకా.

రాయ పొగాకా
పాయ పొగాకా
మద్దూరు లంకాది
మంచి పొగాకు

# జోల పాట

ఉల్లాయాచీ – చొల్లాయాచీ
పొద్దూ పొద్దూ ఒక చాయ
పొద్దెక్కి చాయ
[illegible]ద్రపోయె [illegible]
పొన్న పూచాయ
జాము జాము ఒక చాయ
జామెక్కి చాయ
జామూపై చెల్లమ్మ
పాజా పూచాయ
దాటురా గుంటక్కి
తలగడక పోతే
జల్లు జల్లు మని రాలె
జాజి పువ్వ్యాలు
నిద్రపో చెల్లమ్మా
నీ నిద్ర లేలా
నిద్ర కన్నె కలొచ్చి
నిన్ను లేపెదరు
నిద్రకూ వెయ్యేళ్ళు
నీకు వెయ్యేళ్ళు
నినుగన్న తల్లికి
నిండూ నూరేళ్లు
అందరీ మామల్లు
చందమామల్లు

చెల్లమ్మ మామల్లు
రామలక్ష్మణులు
చెల్లమ్మా బుద్ధులూ
వేణు నాదములు
నిండు పున్నమినాడు
చందమామ నిన్ను
కోరి పోయాడమ్మ
నీ మేనమామ

## పంపులు

బావలందరు గూడి
బండెక్కి వెడుతుంటె
అందులో పెదబావ
బండెక్కి వెళ్ళు...

తెడ్డిరిగి ముడ్డిరిగి
మూతీ పళ్లిరిగీ
మూతీ పళ్ళిరిగిన బావ
నాకేమి తెచ్చావా.

మూటాతో చక్కిలాలు
మువ్వంచు చీర
కావిడితో చక్కిలాలు
కరకంచు చీర...

ఆపర బండీ
అంతరాల ఆ బండీ
ఆపర బండీ
చీరకట్టుకొస్తాను
రయిక యేసుకొస్తాను
కాటుకెట్టుకొస్తాను
బొట్టుపెట్టుకొస్తాను
తలదువ్వుకొస్తాను
పువ్వులెట్టుకొస్తాను

## ఓ రి మొ గ డా

ఓరి మొగడా
ఒయ్యారి మొగడా
నా యేలి పడ్డ
పాటు చూడు
నివు దయగాల
మొగుడవైతే
నేను చిత్రమయిన
చీర గట్టి
నేను రత్నమయిన
రయిక తొడిగి
కాటు కెట్టుకు
కమతలాగున్నాను

బొట్టెట్టుకు
బొమ్మలాగున్నాను ॥ఓరి మొగడా॥
నే గజ్జిలా
కొడవలుచ్చుకుని ,,
నే గుంటూరు చేలోకి ,,
నే వరికోత కెళ్ళాను ,,
నన్నెండ్ర కాయ
కరచింది ,,
నీవు ప్రేమగలా
మొగుడవైతే ,,
నీవు డాటరు
మందెయ్యించు ,,
నీవు ప్రేమగలా
మొగుడవైతే ,,
సరసమైనా
మొగుడవైతే ,,
నాకు సంధి మంత్ర
మేయించు
ఓరి మొగడా ,,
ఒయ్యారి మొగడా
నా యేలి పడ్డ
పాటుచూడు
ఓరి మొగడా.

## ద ప్పు తు పా

మొసుగు బియ్యాం కూడు
మొత్తళ్ళా పులుసూ
మెళ్ళగ దంచుకో
మేనత్త కొడుకా...

ఎక్కిళ్ళు వత్తేను
ఎక్కి తొక్కుండి
ఎరువు చాలా పోతేను
బల్లాలెత్తండి

## బాసలు

అన్న దమ్ముల బండి కట్టి
పరుగు పరుగున పోయేవాడా
బండీ దిగీ బాసలాడార
నాగూరి రాజా
దండసొగసూ చూడగా రారా.

ఆకసమునా సందామామా
అందరానీ సల్లని మామా
అంతు తెలియని బండిబాటోయీ
నాగూరి రాజా
అందు నే మన బాసలన్నీనోయ్.

ఊదరాడ గట్టు మీద
గింజకావలి కాసేదానా
గంజికోసం ఎద్దులొచ్చాయే
నాగూరి రాజా
బాసలాడా మరలివచ్చానే.

# చేను కోత పాట

ఎతే మాలి
ఎతే మాలి
ఏ...సోః——ఓసో...
ఏటీ మీాద
పనా మాలి – ఏ...సో...
ఏటి వార
యేపా జెట్టు – ఏ...సో
ఎక్కి చూస్తే
ఢిల్లి కోట – ఏ...సో
ఢిల్లీ కోట
చల్లాగుంటె – ఏ ... సో......
చిల్లారప్పులు
చెల్లాగొడత – ఏ...సో...
పాలాపాల
పాలా పాల ఏ...సో...
పాలా పాల
బలుసూకూర ఏ...సో...
నేలా నేల
నెల్లికూర ఏ...సో...
పుట్టామీాద
పాలాపిట్ట ఏ...సో...
కొట్టాబోతే
తేలూకుట్టె ఏ...సో...
బావాగారు
మంతారించె ఏ...సో...

అలీ కొమ్మల
చింతా చిగురూ ఏ...సో...
వండీ పె
వలపూ తీరె ఏ...సో...

## రా మ చి లు క

చిలుక చిలుక రామ చిలుక
పలక నంటుందీ
అత్త తెచ్చిన కొత్తకోక
కట్టనంటుంది.
మామ తెచ్చిన సన్నబియ్యం
దంచ నంటుంది
అవ్వ తెచ్చిన ఆది రసం
తినా నంటుంది.
మొగుడు తెచ్చిన మల్లెపూలు
ముడవ నంటుంది
కటారి కోకమీద
కన్ను వేసిందీ.
మామ కొడుకుమీద
మనసు ఉంచిందీ.

# రోడ్డువేస్తూ పాడే పాట

జోరులో జొన్నాడ దాటి
బారులో బందారు దాటి
ఓ లాగరా లాగార నాయన
ఓ నిమ్మ చెట్టుకి నిచ్చెనేసి
నిమ్మపళ్ళు కొయ్యబోతే
నిమ్మముల్లు రొమ్మునాటె
ఓ చీరులోళ్ల చిత్తకళ్లు
రయికలోళ్ల రత్తగుల్ల
ఓ అన్నలారా, తమ్ములార
ఓ అందమైనా శూరులార.

# వెక్కిరింతలు

పూవూ పెట్టిందిరోయ్
పూవూ పెట్టిందిరోయ్
పూవుల కోక మీద
పునుగూ పూసిందిరోయ్
బొట్టూ పెట్టిందిరోయ్
బొట్టూ పెట్టిందిరోయ్
బొట్టూలాంటి - ముక్కు
బాసా పెట్టిందిరోయ్.
నన్నూ చూసిందిరోయ్
నన్నూ చూసిందిరోయ్
నన్నూ చూసినంత
నవ్వే, తేసిందిరోయ్.

# కో కలు

కోటాకు యెల్లాలి
కోటాకు యెల్లాలి
కోటప్ప కొండాకు
యెల్లి రావాలీ
కోటప్ప తిరుణాలు
సూసీ రావాలీ.

కొండాకు యెల్లాలి
కొండాకు యెల్లాలి
కొండాల తిరుపతి
యెల్లి రావా
యేడు కొండలోడ్ని
సూసీ రావ

అలివేలు మంగమ్మ
అలివేలు మంగమ్మ
అలుగూలు తీర్చగ
పోయీ రావాలీ
అలివేలు కుంకూమ
అందీ రావాలీ.

# మోత పాట

మాదీ దూరంగబెట్టి
పంచేకర సాహెబా
ఎర్రకోక పిల్లనాకె
కావాలిరా...
అప్పలమ్మ గండికాడ
కప్ప చచ్చింది
రారోరి తమ్ముడా
మోసుకెడతాము
నాయెద్దు, నీయెద్దు
నీళ్ళు కెళ్ళింది
తాతగారెద్దొచ్చి
తనిమి తరిమింది...
మామగారెద్దొచ్చి
మాత్ర మేసింది
ఎద్దు కొమ్ములమీద
పొద్దు పొడిచింది
పొద్దుపోయి నాగన్న
గుడ్లు కొచ్చింది
అందులో ఓ గుడ్డు
జారిపోయింది
జారిపోయిన గుడ్డు
జల్లెడ కలిసింది
జల్లెడలో సీతమ్మ
స్నానమాడింది.

గొబ్బియళ్లో గొబ్బి గొబ్బున
చెలియాలందరు గొబ్బి పాటలు

సర్వమునకు సృష్టికర్త
ఈశ్వరుడొక డున్నాడు
సర్వేశ్వరుని ఘనత నాకూ
చక్కగ వినిపించవా రే
నల్లగ నుండునా లేక
తెల్లగ నుండూనా
ఎట్టి గుణము కలవాడూ
ఎవరికి మంచీ వాడే
దుష్టతనము మనలో వుంటే
చేరి బుద్ధులు చెప్పావే
గొబ్బియళ్లో గొబ్బి గొబ్బున
చెలియాలందరు గొబ్బి పాటలు

లాగదోరీ లంగరు తాడూ
హైలేసో హావ్వారి హావ్వ...
రేమిరామా యన్నాలారా
అందమయినా తమ్ముళ్లార

ట్టూ తిరుగువాడా ,,
నూతిలో పుల్లేసువాడా ,,
పుల్లసోకూ నాకూ తెలుసూ ,,
ఒల్లకాదూ మల్లీపోరా ,,
అందమయినా శూరూలారా ,,
అందమయినా తమ్ములారా ,,
లాగరోరీ లంగకు తాతూ ,,
హేలేసో హావ్వారి హావ్వ ,,
హే.....లే.....సో.....

## వానకోసం ప్రార్థన

మొర్రో మొర్రో వాన దేముడ
మొర్రో మొర్రో వాన దేముడ
మమ్మింత దయజూచి
మావాడకే రావ...
ఏనుగులాంటి మాగోళ్ళు
ఎత్తులాడి పోయారు...
కూడొండ లేదంటు
కుండెట్టి కొట్టాడు...
మండెడు గంజిలేదాని
మండెట్టి కొట్టాడు ...
ఈనుతున్న చేలన్ని
ఎండిపోవు చున్నాయి...
పండుచున్న చేలన్ని
పండువారి పోయాయి...
దుక్కిటెద్దు లన్నియు
తూలిపోవు చున్నాయి...

## దంపుడు పాట

ఈయేలా ఈ వొడ్లు
దంగవు గామోలూ
ఏలూరు సంతాకు
ఎల్లను గామోలూ...
ఏగాణి గోంగూర
తేనూ గామోలూ
ఎగరేసి తాలింపు
పెట్టను గామోలూ...
సందాలా మూవోరి
కెట్టను గామోలూ
ఈయేలా ఈవొడ్లు
దంగవు గామోలూ.. ,,

## చిన్నదానా

ముక్కుపుడకల చిన్నదానా
మనమెక్కుదామా రైలుబండీ
నీ చక్కదనమును చూడా
వాడెక్కనివడే జాతీవాడూ
ముక్కుపుడకల చిన్నదానా
మనమెక్కుదామా రైలుబండీ
వేమగిరి గట్లామీదా
వెళ్లుదామా జంటాగానూ
ముక్కుపుడకల చిన్నదాన
మనమెక్కుదామా రైలుబండీ

# కొత్తపాట

రోడ్డోర కొతకి
రానే పిన్నమ్మా... ,,
సుజ లెక్కోస్తారు
రానే పిన్నమ్మా... ,,
చూసారు న్నమ్మా
పిన్నమ్మా... ,,
కారుమీదొస్తారు
రానే పిన్నమ్మా... ,,
కసురుకుంటొస్తారు
రానే పిన్నమ్మ... ,,
గాజులన్ని చిట్లుతాయి
రానే పిన్నమ్మ... ,,
కొకంత నలుగుతాది
రానే పన్నమ్మ... ,,
పాపిడంత చెదుగుతాది
రానే పిన్నమ్మ... ,,
సరసోళ్లు సూతారు
రానే పిన్నమ్మ... ,,
చూస్తారు పిన్నమ్మ
రానే పిన్నమ్మ... ,,
చేతులన్ని కందుతాయి
రానే పిన్నమ్మ... ,,

పిల్లోణ్ణొక్కడ
కూకడేసి
పుల్లల
దాని పెల్ల
దాని కెందుకో –

సందకాడ దాని
సందు కాచాడే –

సిలెంకడి చల్దికూడు
సల్ల తిన్నా
వెంకన్నా కాపూ
మా మాలపల్లి రాకయ్యా
నిన్న మద్దినాలరా
జొన్న చేనుకాడరా
నువ్వావతల– నేనవతల
కాలవవతలా
పిల్లోణ్ణొక్కడ
కూకడేసి
పుల్లల కల్లిందో

## ఫు పాట

ఏపా చెట్టూకాడ నాబొమ్మరిల్లూ
కూకోర అన్నయ్య కూడొందుతాను
కూకోర అన్నయ్య కూడొందుతాను
కూటికి కాదప్ప కూతురి కొచ్చానూ
కూటికి కాదప్ప కూతురి కొచ్చాను
కూతూరు చిన్నాది కులమూగొప్పాదీ
కూతూరు చిన్నాది కులమూగొప్పాదీ
అల్లూడు పెద్దోడు వేసిగలోడూ
అల్లూడు పెద్దోడు వేసిగలోడూ
ఓ లేమి యిత్తారు ఓ పెద్దలార
ఓ లేమి యిత్తారు ఓ పెద్దలార
అరుగుమీదరవయ్యి ఓలుముప్పయ్యి
ఏపా చెట్టూకాడ నా బొమ్మరిల్లూ
కూకోర అన్నయ్య కూడొందుతాను.



## బండి తోలుతూ పాడే పాటలు

నిన్ను రమ్మన్నాది
నన్ను రమ్మన్నాది
యిద్దరినీ రమ్మనీ
నిద్దరో తోందో –
నిరా నిరా నిరబండి
గంగి గళ్ళ పట్టెడక్కడికే
గుండెలు తీసిన గుల్లా
నీ గుత్తి నిండా గాజులే
ఓఓఓ దాని కొం ప్రాలోనే

గుప్పెడు యిరా
బాగా
భాగ్యవంతుల కుట్లోడా
ఆఅఆ దాని కళ్ళల్లోనే
కలవరేకలున్నాయిరా
నిన్ను రమ్మన్నాది
నన్ను రమ్మన్నాది
యిద్దరినీ రమ్మనీ
నిద్దరోతోందో
నిరా సిరా నిరబంటి

## పంపు పాట

సురతాడి మావొదిన
సూదూ లమ్మింది
సూదూలమ్మిన గింజ
గాదీ కట్టె.
సువ్వి - హా - సువ్వి
వీపరాలు మావొదిన
విందట్టు కొస్తే
నల్లేరు నలుగెడుదు
కంద నీళ్ళోస్తూ
సువ్వి - హా - సువ్వి
పండినది వొదినా
వలపూలతో
మాగింది ఒదినా
మామిడి పండల్లె
సువ్వి - హా - సువ్వి.

# ఓ చిన్నదానా

బందారు చినదానా
బంగారు జడలదానా
బంగారు జడలామీదా
ఓ. చిన్న దానా
మోజెన్నడు లేదే
ఓ చిన్నదానా

గుంటూరు చినదానా
గుండ్రాని కళ్ళదాన
గుండ్రాని కళ్ళమీదా
మోజెన్నడు లేదే
ఓ చిన్నదానా
మోజెన్నడు లేదే
ఓ చిన్నదానా

నల్లా నల్లాని దానా
నాతీ నడకాలదానా
నాతీ నడకాలంమీదా
మోజెన్నడు లేదే
ఓ చిన్నదానా
మోజెన్నడు లేదే
ఓ చిన్నదానా.....

# సిరిసిరి మువ్వ

బావల్లు వచ్చారు  సిరిసిరి మువ్వ
భాగ్యాలు తెచ్చారు ,,
ల్లు దున్నారు ,,
మోటల్లు కొడారు ,,
విత్తుల్లు జల్లారు
పచ్చగ చేలన్ని
పండీ వొరిగున్నాయి ,,
పంటల్లు కోశారు ,,
మూటల్లు కట్టారు ,,
బళ్ళకు ఎత్తేరు ,,
గలగల ఆ బళ్ళు ,,
గడప ముందాగాయి ,,
ధాన్యాల మూటల్లు ,,
గాదూల నింపారు ,,
పంటాలా పండూగ
భాగ్యాల పండూగ
పుట్టింటి పడుచులకు
పుట్టిందా పండూగ
డూడూడూ బసవన్న ,,
మనపల్లె కొస్తాడు
బావల్లు వచ్చారు
భాగ్యాలు తెచ్చారు

# దంపుడుపాట

అరచేతిలో వడ్లేసి
మోళకజేయి దంపు
ఏమన్న ఎరుగుమురా
ఎయ్యేసి తోటికోళ్ళు
తియ్యేసి పోటు
తోటికోళ్ళు పోటు
తోసెయ్యి పోటు
బావగా రొస్తున్నారు
బాగయ్యా పోటు
రెండిళ్ళ సందూన
పందిమొగమోడు
పందిమొగమోడికీ
పంచల చాపెడితేను
ఇప్పేడు కట్టేడు
ఈదీన నడువాడు
చాకిరే వెయ్యాడు
సబ్బూబ పెట్టాడు
పెళ్ళాని కివ్వాడు
పెళ్ళాను పెట్టాడు

## ఏ పాట

మామిడి పూసిందిరోయ్
మామిడి పూసిందిరోయ్
మామిడి పూతామీద
మామిడి కాసిందిరోయ్...
మామిడి కాసిందిరోయ్
మామిడి కాసిందిరోయ్
మామిడి కాయామీద
చిలుకా వాలిందిరోయ్...
చిలుకా వాలిందిరోయ్
చిలుకా వాలిందిరోయ్
చిలుకా వాలిన పండు
తియ్యాగున్నా దిరోయ్

## కారు పాట

కాంతమ్మా...
కారెళ్ళి పోతూంది ,,
కాంతమ్మ కడియాలు
కారుమీా దున్నాయి ,,
కాంతమ్మ చీరాలు
కారుమీా దున్నాయి ,,
కాంతమ్మ వస్తువులు
కారుమీా దున్నాయి ,,
కాంతమ్మ చూపులూ
కారుమీా దున్నాయి ,,

కాంతమ్మ మనసూ
కారుమీా దున్నాది
కాంతమ్మ పట్టాలు
కాగుమీా దున్నాయి
కాంతమ్మ ప్రాణాలు
కారుమీా దున్నాయి

## సామోరు పాట

రాయే రాయే భామానందనా
రమణీ ముద్దుల గుమ్మానందనా.
సామోరు సత్తైమకూడేను
సరివాదములు యేసుకొన్నారు
వేడికూ ఉెళ్ళాకి యారాలు తెస్తాను
సల్దికూ ఉెళ్ళాకు సవితీని తెస్తాను
చాల పొద్దూ లేదు సరివాదమేశారు
రాకయ్య రాకయ్య సామోరూ
పొద్దుచాలలేదయ్య సామోరూ
మా అన్నలొస్తారు సామోరూ
మమ్మల్ని తిడతారు సామోరూ
మిమ్మల్ని కొడతారు సామోరూ
రాకయ్య రాకయ్య సామోరూ
పొద్దుచాలా లేదయ్య సామోరూ
ఏడుగురు అన్నలు సామోరూ
వచ్చే వేళాయింది సామోరూ

# ఏల పాట

ఆకుచిన్నా అడివీలోనా
నాకుచిన్నా దండా దొరికే
దండపేను కట్ల దండేగా –
ఓ కొంటెగాడా

దండసొగసూ చూడగావలెరా.
చిన్న చిన్నా పువులూ కోసీ
చిన్నదానీ కొప్పూ ముడిచీ
చల్లనేలల నన్ను దలచేరా
ఓ కొంటెగాడా

కొప్పు సొగసూ చూడగావలెరా.
భద్రగిరి కోనాలోనా
చిత్రమయినా దండా దొరికే
చిత్రమయినా బొమ్మమీదానూ
ఓ కొంటెగాడా

చిలిపిమనసు చిందులాడేరా.
కానరానీ అడవిలోనా
విత్తులేకా చెట్టూ పుట్టే
కొమ్మలేనీ చెట్టుమీదానూ
ఓ కొంటెగాడా

రెక్కలేనీ పక్షి పుట్టేరా.

ఆడగలవ
పిల్లవాడా... ,,

అయిలేలో
అయిలేలో
చిన్నదానా
సరసమంటే
చెవికోత
చిన్నదానా... ,,

సరపాలు
ఆడగలను
చిన్నదానా
సంతాకు
వస్తావ
చిన్నదానా... ,,

సరసా
కూకుంటాను
చిన్నదానా
సరసాలు
ఆడతాను
చిన్నదానా... ,,

ప. సి. హ్వా య ం

పువ్వులు
కోయాంగ వెళ్ళి
పూల కంచెలు అన్ని
తప్పించు కెళ్ళి
పాపలు వెళ్ళారు
పాలా బుగ్గలతో
పూవ్వులు తెచ్చారు
పూలా బుట్టలతో
పూలాతో దేముడిని
పూజించగాను
పూవూల దండాలు
గుచ్చారు వారు
పూజాకు దేముడిని
సిద్ధాపరచంగా
పనుగు, పాలాతోటి
శుద్ధి చేశారు
బాకాలు - తాళాలు
మేళవించంగ
పాపలు దేముడిని
పూజించినారు
దేముడిని చేతూల
తాకూంచు వారు
పలకరింపుల నెన్నో
పలక సోశారు

నందూన

ఏమిటో ముఖమింత
చేసుకున్నారు

ఫలమూలు, బెల్లాలు
కదల నందూన

పాపలా పలుకులకు
కులక నందూన

ఎందుకో బొమ్మను
చూస్తూను వారు

ఏమిటో ? యోచనా
చేశారు వారు

## దంపుపాట

బావయ్యొచ్చాడూ
కూరేమి లేదూ
కుళ్ళిపోయినా
గుమ్మడి కాయా
బావాకు కూర___

అన్నయ్యొచ్చాడూ
కూరేమి లేదూ
గుడ్డెట్టు కోడిపెట్ట
గుజ్జన్న కూర.

# పూల పాట

బంతి పూచి
బంతి
బంతూలవలె - పూ
బంతి పూచింది

మల్లి పూచిందీ
మల్లి పూచిందీ
మాయింటమల్లె - పూ
గుత్తి పూచిందీ.

పూవు నవ్విందీ
పూవు నవ్విందీ
పూలకన్య సిగలో
పూవు నవ్విందీ.

కన్నె మురిసిందీ
కన్నె మురిసిందీ
సిగలోసి పూలుచూసి
కన్నె మురిసిందీ.

# కోవేసపాట

సరసపతిరా సాయమొచ్చి
అయిలేసా వో చేలిసా
అదిమానాకన్నా తల్లె
అయిలేసా వో చేలిసా
కన్న తల్లికే యిరుకెర
అయిలేసా వో చేలిసా
మొగంనిండరా కోపం తెచ్చి
అయిలేసా వో చేలిసా
జోరుచేసి రాపటండి బాబు
అయిలేసో వో చేలిసా
పడుచువోళ్లురా మీారు
అయిలేసా వో చేలిసా
పట్టు తెగితేరా
అయిలేసా వో చేలిసా
కొత్త తాడూ వేశేద్దాము
అయిలేసా వో చేలిసా
అయిలేసా వో చేలిసా.

# రోడ్డు బం పాట

ఓ యన్నలార
తమ్ములార
ఓ యందమైన
శూరులార
పట్టండీ
పట్టండీ జాన
ఓ పట్టనోడి
నోటి లోన
పచ్చిమిరప
పాలు పొయ్య
ఓ దిబ్బమీదా
దీప మెట్టి
దేముడా నీ
మొక్కబోతే
దయ్యమాయె
తరుమ బోయె
ఓ పలకంద్ర
పలకంద్ర జాన
ఓ మడత మేనీ
చిరుత కజ్జీ
చిరుత కజ్జీ
కంచుమ్రోగు
కనుము మ్రోగు

కట్లుగాడూ
మూరు డస్న
జాన కోకటి
బార కోకటి
ఆ పట్టుండి
పట్టుండి జాన...

## ని ర బం డి

నిర నిర నిరబండి
నిర నిర నిరబండి ...

బారకొమ్ములగేదె
బాడవలో కొచ్చింది
నాగేదె మాదొంగ
నాగూరె దొంగ ...

తాటాకు తలగుడ్డ
గోంగూర గోచిగుడ్డ
యీదిలో యిటికాము
ంబాతుంకు డిల్లే ...

యర్రయర్రని దాన
ఎత్తూ పిర్రల దాన
నీయున్న మాదొంగ
నాగూరె దొంగా ...

# సువ్వి పాట

సువ్వి కస్తూరిరంగ
సువ్వి కావేటిరంగ
సువ్వి రాఘవాభిరామ
సువ్వి లాలీ
సువ్వి సువ్వి...

తుమ్మెకర్ర రోలుదోసి
తూముడొడ్లు వాయవేసి
దంచుదామా బియ్యం
దంచుదామా
ఆ సువ్వి ఆ సువ్వి...

ఒక్కవేలు చుక్క బొట్టు
అందరికీ చాలదమ్మ
దంచుదామా బియ్యం
చెలియలందరు
ఆ సువ్వి ... ఆ సువ్వి...

ఒకరి ఒకరి కొప్పులోన
గుప్పెడేసి మల్లెమొగ్గలు
మగువకాంత కొప్పులోన
మల్లె జాజులు
ఆ సువ్వి ఆ సువ్వి...

# రోడ్డు బంటా పాట

అరిజెల్ల
బేలి మోత
నల్ల నేలల
దున్నా దలచేరా...

దేముడనేరా
మొక్క బోతే
దయ్యమాయీ
పట్టినాదిరా...

మానయంబా
గాలి మోతా
గాలిమోతా
దీపి మోతరా...

రేమిరన్నా
ఉసాను లేదు
రాగి డబ్బు
యీాడూానుంతరా

మిద్దె మీాదా
మిరప చెట్లా
బొట్టు పెట్టి
గొమ్మా చూడరా...

నీలు లేవూ
పాలు లేవూ
రంగు చూసీ
కాయా కోయరా

చిన్నా దయ్యాం
ఓ కేడి కొయ్యా
ఓడా మీదా...

అన్నలారా
తమ్ముల్లారా
పలక నోడి
నోటిలోనా
పనికి మానీ
పాలూ పోయ్యా
చూడ చక్కని
చిన్న దయ్యా...
ఓ కేడి కొయ్యా
ఓడా మీదా...

ఓ అన్నలారా
శూరూలారా
పలికి నోళ్లా
నోటిలోనా
పనసదారా
పాలూ పోయ్యా
చూడ చక్క॥
చిన్నా దయ్యా
ఓ కేడి కొయ్యా
ఓడామీదా...

## మల్లె పాద

మల్లెపాదనూ యింట
పెంచుకోవాలీ
మల్లెపూలూ సిగలో
ముడుచుకోవాలీ
మల్లె పాదమాటూన
మాటిచ్చినాను.

మల్లివస్తానని
చెయ్యేసినాను
మాట తప్పితే మల్లి
కోపగిస్తాది
మరచావులే మాట
నెక్కిరిస్తాది.

మల్లి పాదమాటూన
మాటలా మధ్య
మల్లివస్తానసీ
మాటిచ్చినాను.

మాటతప్పినేను
మల్లిచేరకపోతే
మాటతప్పావనీ
మాటలంటది మల్లి.

మల్లి పాదమాటునా
మనసివ్వుకోని.
మనసులో పోటూను
చూసుకున్నాను.

ఫలో ష
లాటలాడాము
కలలలో యేటోను
కన్నాముమేము.

## ఒ య్ం రా జ

రాచవారి చిన్న
ఒయ్ రాజ
రారా ముద్దూలగుమ్మా.

రెండూళ్ల మధ్యా!
యేరుగట్టి దున్నరా,
రాచవారి చిన్నవాడా
ఒయ్ రాజ
రారా ముద్దూలగుమ్మా.

అవునిత్తా నమ్ముకోరా
ఒయ్ రాజ
దూడనిత్తా నమ్ముకోరా
రాచవారి చిన్నవోడా
ఒయ్ రాజ
రారా ముద్దూలగుమ్మా.

# ఏమే నీ పేరు ?

ఏవూరు భామా
ఏమే నీ పేరు ?
ఏవూరు భామా
ఏమే నీ పేరు ?

నీ పేరు చెప్పవే
నిలిచొక్కసారి
ఏవూరు భామా
ఏమే నీ పేరు ?

మావూరు లేలా
మా పల్లె లేలా
మావోరు యింటేను
మంచోరు కాదూ.

ఏవూరు భామా
ఏమే నీ పేరు ?

మీవోరు యినకుండ
నీకు మాట రాకుండ
చెవిలోన వొక మాట
చెప్పుళ్ళ రాదా...

ఏవూరు భామా
ఏమే నీ పేరు ?

ఎగువా బందరు కోట
దిగువా బందరు కోట
అవతాల యివతాల
దండీ మావూరు... ॥ఏవూరు॥

# తడికమ్మ పాట

కొత్తి కూర తెచ్చాను
గోంగూర తెచ్చాను
వందమాని చెప్పవే
తడికమ్మా...

కొత్తికూర తెసేను
గోంగూర తెస్తేను
వందనాని చెప్పవే
తడికమ్మా...

తాటిపండు తెచ్చాను
బుజ్జిగుంజు తెచ్చాను
వందమాని చెప్పవే
తడికమ్మా...

తాటిపండు తెస్తేను
బుజ్జిగుంజు తెస్తేను
వందనాని చెప్పవే
తడికమ్మా...

కొత్త బియ్యం తెచ్చాను
కొత్త కుండ తెచ్చాను
వందమాని చెప్పవే
తడికమ్మా...

కొత్తబియ్యం తెస్తేను
కొత్త కుండ దెసేను

చెప్పవే

నై...

నులకమంచం తెచ్చాను
కంబళీ తెచ్చాను
వెయ్యమానీ చెప్ప
తడికమ్మా...

నులక మంచం తెస్తేను
కంబాళీ తెస్తేను
రమ్మాని చెప్ప
తడికమ్మా...

## చిన్నదానా

నే రంగమెల్లి పోతానే
చిన్నదానా
నే రంగమెల్లి పోతానే
చిన్నదానా...
రంగమెల్లి పోతావ
చిన్నవాడ
నీవు రంగమెల్లి పోతావ
చిన్నవాడా !...
రంగమెల్లి పోతానే
చిన్నదానా
నే రంగంలో వుంటానే
చిన్నదానా...
నీవు రంగంలో వుంటేను
చిన్న

చిన్నవాడా...

నే, రంగంలో వుంటాను
చిన్నదానా
నా మనసంత నీ మీదె
చిన్నదానా...

నీవు లేని ఒక రోజు
చిన్నవాడా
నే గడపగ లేనయ్యా
చిన్నవాడా

నే రంగమెల్లి రంగైన
చిన్నదానా
రవ్వలు కొని సంపుతానె
చిన్నదానా...

నీ రవ్వాలు నాకొద్దు
చిన్నవాడా
నీతోటె వుంటాను
చిన్నవాడా...

రంగమంత రంకులదే
చిన్నదానా
రం   నిలయమే
చిన్నదాన ...

రంకూరాల రంగంలో
చిన్నవాడా,
మరి, నీవేల వుంటావు
చిన్నవాడా? ..

# సాదున్న

సాలు దున్న
సాలు దున్న ఓ బావా
సాలాడి నేతకాదు ఓ బావా.

విత్తులయిన
జల్ల గలవ ,,

వీరత్వం
చూపించు ,,

మోహ్నైన
కట్ట గలవ ,,
నిమ్మళ్లు ,,
నిండుతాయి ,,

కోతలన్ని
వచ్చినాయి ,,

కోరినట్టి
రెకలియిం ,,

రాసుల్లు
పోశావ ,,

గాదుల్లు.
కట్టావ ,,

రాసులయిన
నింపావ ,,

,,

## పాట

రేరే... రేక్కాయలూ
అరేరే రేక్కాయలూ
నువ్వావతల
నే నవతల
కాలవవతలా
కాలవవతల
కాజా బుడ్డి
ఒంగుతున్నాది
గుబాగుబా
లచ్చించారు
పొంగిపోతూంది
బటానీల
కోకమీద
కన్నేశాడే
సెనగపువ్వు
రయికమీద
చెయ్యేశాడూ
ఆడుకోమని
ఆర్మోనీ
పెట్టింపాడూ
నీరుకాయ
పంచోడా
సిక్కేందుకు
చెవిబొక్క, లేనోడ
సోకెందుకురా?.....

## ఊత పదాలు

అన్నల్లు వచ్చారు
కూరేమి కూర
ఆ సువ్వి ఆ సువ్వి...
అలచంద పప్పు
అడవి కాకరకాయ
ఆ సువ్వి — ఆ సువ్వి ...
బావల్లు వచ్చారు
కూరేమి కూర
ఆ సువ్వి — ఆ సువ్వి ...
పాదుల్లో కొండల్లు
గోడ బల్లుల్లు
ఆ సువ్వి — ఆ సువ్వి ..

## ఓ చిన్నదానా

రంగు రంగూలదానా
రంగైన చిన్నదానా
రంగాము పోయినేను
చిన్నదాన
రంగైన రయిక తెస్తా
చిన్నదానా

బంగారు మురుగువాడా
బుజ్జి మీసాలవాడా
రంగము నీవు పోతే
చిన్నవాడా
నాగలి ఏమిటంటా
చిన్నవాడా

పువ్వులా పుచ్చేదానా
రంగాము నీవువస్తే
చిన్నదానా
రంగము భంగమౌనే
చిన్నదానా ...

బంగారు మురుగువాడా
పనసా బుగ్గలవాడా
రంగైన నామీద
చిన్నవాడా
మనసేల లేదురా
చిన్నవాడా ...

సరి అయితే నాతో రావె
సరస కూచుంటారావె
రంగంలో సోకుగాను
చిన్నదాన
రంగల్లె వుండాలె
చిన్నదానా...

నీ పక్క నేనే వుంటే
మనమాట ఒకటే అయి
సోకూకు లోటు యేటి
చిన్నవాడా
సారసాలె — కాదువోయ్
చిన్నవాడా...

అ

ఎల్లోస్తావా బావ
ఎల్లోస్తావా...
ఎల్లోస్తావా బావ
ఎగిరోస్తావా ?

ఏనాడు పిలచీన
ఎందూకు పిలచీన
ఎగిరోస్తానే పిల్ల
ఎల్లోస్తానే
ఎల్లోస్తానే పిల్ల
ఎగిరోస్తానే.

ఎల్లిపోతూ నీవు
యేటోటూరు సెప్పావు
ఎగిరోస్తావా బావ
తిరిగొస్తావా ?
తిరిగొస్తావా బావ
ఎల్లోస్తావా ?

ఆ – అంటె అడవులు
కో – అంటె కోనలు
దాటోస్తానే పిల్ల
ఎగిరోస్తానే
ఎగిరోస్తానే పిల్ల
ఎల్లోస్తానే.

అడవులు కోనలు
వరదాలు – పరదాలు
దాటోస్తావా బావ
ఎగిరోస్తావా ?
ఎగిరోస్తావా బావ
ఎల్లోస్తావా ?

# గంగా వాదం

శివ శివ ణు
శివ శరణు చాలా
శివ శరణు మాపాలి
శివుడికీ శరణు:

హరి శరణు — హరి శరణు
హరి శరణు చాలా
హరి శరణు మాపాలి
అచ్యుతులకు శరణు.
గురు శరణు — గురు శరణు
గురు శరణు చాలా
గురు శరణు మాపాలి
గురువులకు శరణు.

వెండికొండల మీద
పెద్ద మహాదేవి
ప్రేమంతో తన కొడుకు
పెండ్లాన్ని పొగడె
హిమవంతు మీయింట.
కన్యా ఉన్నాదా ?
ఇస్తే మా శంభునికి
యివ్వమని అడిగె
తల్లి తండ్రీ లేని
తగని కాపురం
అత్త మామా లేని
అతను ఒంటరిగాడు
మాయలా శంభుడికి
మేమియ్య మనిరి

ద్వా:

ంట

చతురాలు వాకిటా
దానిమ్మ పూచే
మానవతి గోరింట
మల్లె పూచింది
ఎక్కాను గారమ్మ
వెన్నంటకుండ
వంచెను ఆ కొమ్మ
వసిలాపకుండ
కోసెను ఆ పూలు
గోరంటకుండ
తలముడిచి నా పూలు
పళ్లాల బోసి
పంపెను పదివేలు
గంగ మేడలకు.
వాడుపువ్వులు పంపింది
వని తెవ్వరమ్మ?
వాడుపువ్వులు పంపింది
వనిత గారమ్మ.
చాలవని గంగమ్మ
సరికొల్లలాడె.
సరిగాను పంచుటకు
సరిదాన వాటె?
సరిదాన్ని కాకుంటె
శివుడేల దెచ్చు?
శివుడేల తెచ్చును
జగమేల మెచ్చు?

శివునికి చిన్నాలె
నీకు చెల్లెలను
కట్టరా నా సవతి
పళ్ళన్ని రాల.
అక్కరో నీ హస్తమున
కొట్టిన్న పళ్లు
కూర్చుండి యేరిస్తు
గుళ్ళుపుదిగలను.
నిలచుండి యేరిస్తు
నిలువు గాదెలను
ఒడిగట్టి యేరిన
ఒకటి లేకుండ
చిన్నలకి పెద్దలకి
నువు పంచిపెట్టు
అంతకంటె చిన్నలకు
అక్కరో నేను.
సరిగాను పంచుటకు
సరిదాన వాటె ?
సరిదాన్ని గాకుంటె
శివుడేల దెచ్చు ?
శివుడేల దెచ్చునూ
జగమేల మెచ్చు
శివునకు చిన్నాలె
నీకు చెల్లెలను.
అంతటా గౌరమ్మ
వాకటా నుండె
కానబడకా దాగె
గంగమ్మ తాను.

వీరన్నను పిలిచి
అయిదు దినములనుంచి
స్నానంబు లేదు
ఆరు దినములనుంచి
శివపూజ లేదు
శివపూజ నైనైన
చేసుకో లేదు
ఉదకముల జాడలూ
చూచుమీ కొడుకా.
ఇటు వెళ్ళి వీరన్న
ఈ కొలను చూసె
ఈ కొలను ఉదకములు
దాచింది గంగ.
అటు వెళ్ళి గంగన్న
ఆ కొలను చూచె.
ఆ కొలను ఉదకంబు
దాచింది గంగ.
ఇరుగు వారిళ్ళకూ
పోయిరా కొడకా.
పొరుగు వారిండ్లకూ
పోయిరా, కొడకా.
ఇరుగు వారిళ్లలో
యిసైనైన లేవు
పొరుగు వారిళ్ళలో
బొట్టైదూ లేవు.
కానువారిళ్ళకూ
పోయిరా కొడకా

నేతి పాలా గారి
శివపూజ చేసె.
పక పక నవ్వెనా
గంగ తా నవ్వుడు
ఈగలను దోమలను
విడిచెనే గంగ
కండ చీమల మ్రాను
కదిపెనో గంగ.
ఈగల్ని దోమల్ని
నే విడువజాల
కండ చీమల మ్రాను
చెండుచున్నాది
పంచగిరులామీద
మీ తండ్రి శివుడు
పంచగిరులాదాక
పోయిరాకొండకా.

పోయి నే శివుడుతో
యేమా నెదమ్మ ?

దయబుట్టి జెప్పరా.
నీ తండ్రికోను.

పుట్టించ గిట్టించ
బ్రహ్మకర్త నేను
అందరిని రక్షించ
విష్ణు కర్త నేను
ఆయుస్సుపోయ్యా
తాను కర్త నేను
అయిదో తనాలియ్యా

కావలసిన గంగనీ
ఏ నేను
గంగనీ
బ్రతిమలాడమను.
ఏ వేళ గంగతో
ఎదురు వేళామా
ప్రాయాలు మాయమ్మని
పోకుమని చెప్పు.

అనుచు శివుడప్పుడూ
అచ్చోటుకు వచ్చె
వచ్చిన శివ ప్రభుని
చూసి గౌరమ్మ.

వింటివా జంగమా
ఇంతి మాటల్లు
ఎటునుండి వచ్చింది
ఇంతి ఈ యిల్లు?
.... నన్నా యేలు
గౌరినన్నా యేలు
లోంగుండ లేనయ్యా.
గంగతో నేను
తట్టిలో కాపరం
బుట్ట కొచ్చేను
ఇట్టాటి సవతితో
నే నేగలేను.

రాళ్ళ దొర్లిందాన
రాణ కొందరాకె?
రొయ్య లమ్మిందాన
రోస మొందాకే!
తండ్రి మాటినకుండ
తర్లి పోతావు
మొగుడింట నుంటాన
మోసగిస్తావు
ఉండటానికి యిల్లు
ఉండెనే నీకు?
బండలే నిలవక
పగిలిపోతాయి
తల్లి లచ్చిమంచు
తలబికుసు నీకు
తలి బిడ్డా వరస
తప్పింది నీకు
కాళ్ళు బుట్టిందాన
కాళ్ళు దోర్లేవు
యిల్లాలి కాపరం
మెలిగించ లేవు
పిచ్చోడు జంగమే
తెచ్చు కున్నాడు
చిచ్చెట్టి కాపరం
రచ్చ కీడ్చేవు
నా స
తెల్లిపోవేమే
ఇల్లాలి కాపరం
మెలిగించ

వింటివా జంగమా
యింటి మాటల్లు
ఎటునుండి వచ్చింది
యింటి ఈ యిల్లు.

గౌరమ్మ మాటలు విన్న
గంగమ్మ తల్లి . . .

వింటివా సాంబయ్యా
యింటిమాటల్లు
ఈ సవితితో నేను
యేగ లేనయ్యా
కొండలో నుండేటి
కోయదొరసాని
వెండిలో కొచ్చింది
వెలిగిపోతుంది
నిప్పుకన్నుండియు
నిలుచుంటివేమి
కన్ను తెరవారాద
కాల్చెయ్యరాద
తల్లి మాటవినకుండ
తపసు చేసేన
తలి వరసిందులో
తప్పింది ఎవరు ?
తలపైన నన్నుంచి
తరుణిరో నీవు
పరసాల నాడేవు
సగ దేహ మిచ్చె.
  త్రికొచ్చి కళ్ళు
మొత్తుకుంటుంది

పత్తినాన్ని సూపాన
అత్త నా సవితి
కోయ నా సవితింకో
కులుకులా వేల
రావయ్యా సాంబయ్యా
రావయ్యా నీవు
రతన్నాలు నా తండ్రి
రాసి పోస్తాడు
ఏమి తక్కువ నీకు
ఈ బూడిదేల
ఒళ్లమాలిన దాని
వల్ల కాడుంచి
రావయ్యా పోదాము
రతనాల దీవి
చిచ్చరికి నా సవితి
సచ్చిపోతేను
తెచ్చుకున్నా విప్రుసు
ముచ్చలా దీన్ని
నా బలము తెలియదే
నా సవితి నీకు
కోప మొచ్చిందంటె
కొండ లాగవుతె
వెండి కొండయ్యేను
కొండైన
ఏటిలో కలిపేను
నీట ముంచేను
అలిగి నే పోతినా
నిల్వావే సవితి

అగుపించనే
గంగమ్మ అపుడు.
ఒద్ది లేకపుడు
గౌరమ్మ తల్లి
చేరి కొడుకుతో చెప్పె
మరి బాధతోడు
నీచుదానింటికి
పోయిరా కొడుకా
పల్లె దానింటికి
పోయిరా కొడుకా

పోయి గంగమ్మతో
ఏమనే దమ్మా?

దయపుట్ట చెప్పరా
గంగమ్మతోను.

చేకత్తి కైజారు
చేత బుచ్చుకుని,
బల్లెమూ, శూలమూ
వల్లె తాడొకటి
రాక్షసుల మర్దించ
రంప మొకచేత
కొమరుండు ఆ వీర
భద్రుడే కదిలే.
గుజ్జు మామిడీ దాటి

గురివింద దాటి
పసుపోన్న పూసినా
డేరాలు దాటి
వెళ్లేను వీరన్న
గంగతావులకు
క్షీరాబ్ధి మా యింట
శివశరణు మీకు
లక్ష్మివై వర్ధిల్లు
కొనుము వీరన్న
ఎన్నడు నాజాడ
ఎరగవుర నీవు
ఏం పనికి వస్తివి
నీవు వీరన్నా ?

మాయమ్మ రమ్మంది
పోదాము రానె

మీయమ్మ ఎక్కువేమి
నా తక్కువేమి ?
ఎవ్వారి పనివుంటె
వారె వత్తూరు
సాకాలదాన్నిపుడు
చావగొట్టింతు
యమబాధలు దాన్ని
పెట్టింతు దాన్ని
యమధర్మరాజుకే
అప్పగించొస్తా
పోవోయి వీరన్న
పోంకాలు మాని.

గంగ యింటినుంచి
వీరన్న అప్పుడు
చేరెనూ వీరన్న
తల్లి మేడలకు
షంషరానిళ్ళకూ
పంపితివి అమ్మా
అనరాని మాటలూ
ఆడింది గంగ.

కొడుకు మాటలు విన్న
గౌరమ్మ అంత
నీచుదానింటికే
పోయి వద్దాము.
వల్లె దానింటికే
పోయివద్దాము

గౌరమ్మ రాకను
గంగమ్మ చూసి
ఎండు చేపలు తెచ్చి
వాకిళ్ళ పరచె
పచ్చి చేపలు తెచ్చి
పందిళ్ళ పరచె
కప్పకడిగిన నీళ్ళు
కళ్లాపు జల్లె
నీచుదానింటికీ
ఏలొస్తి వక్కా ?

నీచుదానవు గావు
నా చెల్లెలావు.

ఈ సూర్యచంద్రులూ
సాక్షులున్నారు.
మర్రుల మానేళ్ళు
సాక్షులున్నారు
సరసముప్పయి కోట్ల
దేవతలు సాక్షులున్నారు
పుట్టెను ఒక మహిమ
భూమిలోపలను.
పట్టెను ఒక మేఘం
పర్వతంగాను.
కురిసెను ఆ వాన
కొండలా పొడుగు
విభూతి గుండములు
వీధులకు పారె.
మల్లెయ్య గుండాలు
మడుగులై పారె.
గంగలో గౌరమ్మ
స్నానంబు చేసె.
గంగమ్మ రాకుండ
గడియ వేసుకునే
గెల్చితివి గౌరక్క
కల్లలాడితివె
సూర్యులూ, చంద్రులూ
సాక్షులేమయిరి!
మర్రులూ, మానేళ్ళు
సాక్షులేమయిరి!
దేవతలు అందరు
సాక్షులేమయిరి!

ఇద్దారి వాదంబు
ఈడేర్చితేక
సిరసుపైనా గంగ
దేవినుంచుకొని.
తొడలపై పార్వతి
దేవినుంచుకుని
కదిలెనే శివుడు తన
కళ్యాణి గిరికి
గంగమ్మ గౌరమ్మ
వాదంబు వింటె
విన్నవారికి యిచ్చు
విష్ణులోకంబు
కైలాస మిచ్చునూ
గంగాధరుండు.

# ప్రశ్నలు

నల్ల నల్లాని దానా
నల్లనీ కోకాలా దానా
ఎందుబోయీనావు
చెప్పావే

నీ వెందుబోయీనావు
చెప్పావే

చిలపీచూపులూ చూస్తూ
చెంగున గంతులూ వేస్తు
ఎందు బోయినావు
చెప్పావే

నీ వెందూబోయీ నావు
చెప్పావే.

పిల్లానీవూ నన్నూ విడిచీ
పరుగులూ, గంతూలూ వేసీ
ఎందుబోయీ నావు
చెప్పా

నీ వెందుబోయీ నావు
చె:

# రోడ్డు రోలరు పాట

ఓయల్లారే బేలియల్లి
లాగండి లాగండి బాబు
యల్లారే బేలియల్ల
రోలా కాదు బరువూ రోల
లాగనోడి బుద్ధి కాదు ,,
లాగి నోడే దేముడయ్యా ,,
కదలదూ కదలందీ జాన
రోల కాదూ చిన్నదయ్యా ,,
మూరెడూ జానెడూ లేదు ,,
సిగ్గులేదూ దుక్క జనము ,,
రోసమూ మీసమూ లేదు ,,

ఓ యల్లారే బేలియల్ల
ఓ యల్లారే బేలియల్ల

ఓ పిల్లా...

అర్ధ రాతిరి కాడ
అరుగు మీదుంటేను
అడుగు లేతావేటి
చిన్నోడా
బెదురు లేదానీకు
బుల్లోడా...

ఈయేల యీచోట
ఇంతరాతిరి కాడ
ఏటి చేతుండావే
ఓ పిల్లా
సోకుగా నుండావె
ఓ పిల్లా...

ఇంత రాతిరి యేల
ఈడ నీకేటి పని
ఎగురుతుండావు లే
బుల్లోడా
పనియేటూ సెప్పెళ్ళు
పిల్లోడా...

చల్లన్ని వెన్నెలా
చక్కగా కాస్తాది
చూడ వక్కగ నాతో
ఓ పిల్లా
చేరవస్తావోలె
ఓ పిల్లా...

చల్లన్ని మాటలూ
చక్కగా సెప్పావు
దూరాన నావోడు
పిల్లోడా
తొందరగ వస్తాడు
పిల్లోడా...

అయితే నే పోతుండ
అసలు మాటేటంట
అదురు లేకను చెప్పు
ఓ పిల్లా
అదురుగా వుండాది
ఓ పిల్లా...

చుక్కాని యేలకీ
చల్లమ్మ వస్తాను
చల్లంగ పొమ్మురా
పిల్లోడా
సరసోళ్ళు చూస్తారు
పిల్లోడా...

# చుక్కల చొక్కా

చక్కాని పిల్లా వాడా
చుక్కాల చొక్కావాడా
చల్లమ్మ నాతో వస్తే
ఓ పిల్లా వాడా
చక్కాగ ఉంటాదిరోయ్
ఓ పిల్లా వాడా...

నీలాల కళ్ళదానా
నీలాపు చీరదానా
నిక్కంగ నాతో వుంటే
నీకేమి లోటే...
ఓ చిన్నదానా
నీకేమి లోటే...
ఓ చిన్న దానా...

చల్లమ్మ నెడుతూ వుంటే
చుక్కాల చొక్కాయేసి
చల్లగ నీతో రానే
ఓ చిన్నదానా
సరసాలు ఆడా రానే
ఓ చిన్నదానా...

చుక్కలచొక్కా వాడా
చుంచు మీసాలవాడా
దాకులంట రాకురోయ్
ఓ చిన్నవాడా
నా యన్న చూస్తాడు
ఓ చిన్న వాడా...

# తెరచాపపాట

హైలేస ఓ బేలిసా...

అయినేలో మనవాడూ ,,
దండా మోడే పాదాలు ,,
ఆ ఒక్కా మనవాడూ ,,
అనేలో మనవాడూ ,,
దానీ వాలీ లాలీకో ,,
కోరంగి మొండే మనవాడూ ,,
మానాయంబా కిన్నెరమోత ,,
కొండా మీదారా ఒక
కోడి పిట్టా కూసెరా ,,
రంగంలోనా మానాయంబా
వాలీకెంతో సంతోషం ,,

హైలేసా వో బేలిసా.....

# ఉయ్యాలా

ఓయి బామలాల
ఉయ్యాలా
బామలందూనా ఉయ్యాలా
రాజమా రాజు ,,
పట్టపురాజు ,,
పట్టపూ రాజుకే ,,
పెద్దూరు కొడుకులు ,,
ఆగ్గూరు కొడుకులకు ,,
కళ్యాణ మయినాది ,,
కడసారపు కొడుక్కు ,,
కళ్యాణమవలేదు ,,
కంది ముఖమూత్రో ,,
కచేరి కెల్తున్నాడు ,,
కచేరి పెద్దలూ ,,
ఆడేటి మాటలూ ,,
ఛి...ఛి...ఛి...రజా ,,
సిగ్గే లేదా ,,
పెద్దవాడు రాజు ,,
పెళ్ళే లేదా ఓయి ,,

మొగ్గలేసిన మామ.
పాత నులకలచేత
నేత నడుముల మామ.
ఈదంట వెలుతుంటె
ఈల వేసిన మామ.

## వీడ్కోలు

మాయమ్మ లక్ష్మిందేవి
పోయి రావమ్మా...
పోయి నీ అత్తింట
బుద్ధి గలిగుండు
ఎవ్వరే మాడిన
ఎదురాడకమ్మ

మ:
మాట లెన్నున్నాను

మాటాడకమ్మా
పలుమారు మామీద
ప్రేమలుంచకుమా
ఆకలున్నాగాని
అని అడగబోకు
మాటాకీ పదపోరు
నాటకు దతను
అతని కాదనీ పూలు
ముడవ బోకమ్మా...

బొమ్మరిల్లున్నాయి
బొమ్మలున్నాయి
నేనూ ఆడేటి
సాలా లున్నాయి
నామారుగా మీరు
ఆడుకోరమ్మా
పోయి నా అత్తింటికి
పోయీ వస్తాను
దీయుంచు అన్నల్లు
దీయుంచు అక్కా

మాయమ్మ లక్ష్మిందేవి
పోయిరావమ్మా...